కాలమున నీతని నర్చించుట పరమార్థమేమి? ఋతుధర్మములు చక్కగనున్న శ్రావణభాద్రపదము లప్పటికి దేశమంతయు చక్కగ వర్షించి సకలవిధములయినపాడి పంట లేర్పడవలయును. సాధారణముగ గణపతిని పూజించు పూజాద్రవ్యములు, అడవిపూలు, ఆకులు మొదలగునవి. ఈవిఘ్నేశ్వరునిస్థానము గ్రామముల పొలిమేరయందుంటున్నది. ఈతడు గ్రామసూర్తులకును పూజనీయుడు.

పైర్లు పంటలు అభివృద్ధికి వచ్చుకాలమున నర్చింపబడునీదేవుడు వ్యవసాయాధిపతిగ నుండగలడని యొకయూహ గలదు. ఈతనియనేకనామములలో నొకటగు "ద్వైమాతుర" యనినది ఈయూహను బలపరచును. 'ద్వైమాతుర' యనగ ఇద్దరుతల్లులు పార్వతీ గంగాదేవుల గలవాడని యర్థము. కాని యీయర్థమంత తృప్తికరముగ లేదు. ఏలయన, దేవతలైనను పార్వతీగంగలు సవతులు. అట్టియెడ వారిలో నొకరి కుమారుడగు గణపతికి ద్వైమాతురత్వము సులభముగ జేకూరనీయరు.

"ద్వైమాతుర" శబ్దము, గ్రీకులవ్యవసాయదేవతయగు 'డెమిటర్' ( Demeter or Demetrius ) నామమును ఏకార్థము గలవనియనుకొనవచ్చును. 'డెమిటర్' యనునామె సస్యదేవత. ఈమెకు 'సిరిస్' (Ceres) అను మరియొకపేరు గలదు. 'సిరిస్' అనిన శ్రీ లేక సంపదయనిస్ఫురించుచున్నది. సిరిస్ అనగా సస్యదేవత యనియర్థము. ద్వైమాతురశబ్దమే డెమిటర్గ మారుట కవకాశము గలదు. కనుక ఈరెండుపేర్లును ఏకధర్మము గలిగిన యొకదేవతకే చెందుట అసంభవము కాజాలదు.

'డెమిటర్' అనుదేవతస్త్రీయైయున్నది. మన ద్వైమాతురుడు పురుషుడు. ఇదెట్లు అన్వయింపగలవని సందేహము గలుగవచ్చును. గ్రీకులదేవతయగు వీనస్ దేవత స్త్రీగ పరిగణింపబడుచున్నది. మనదేశపుపురాణములప్రకారము వీనస్ అనగా శుక్రగ్రహము. శుక్రుడు పురుషుడు. వీనస్ ఆడుది. ఇట్లెన్నియేని యుదాహరణములు చూపవచ్చును. కావున ద్వైమాతుర, డెమిటర్ నామములు ఒకదేవత పేరుకాదను శంకకు తావులేదు.

గణపతికిగల నామములు మరి కొన్నిగూడ ఈయూహ కాధారము గల్పించుచున్నవి. లంబోదర యనుపేరు గణపతికి చెందియున్నది.

మన మొసగు కుసుములను, సకలవిధములయిన ఫలములను ఆరగించు ద్వైమాతురుడు మనవ్యవసాయమును కాపాడవలదా!

---

## ఎత్తయినగోపురము

ఫ్రాన్సుదేశమున అత్యున్నతమగు నొక గోపురమును కట్టుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. "ప్రపంచపుగోపుర" మని దీనిపేరు. దీనిని కట్టుటకు చెట్రము, కంకర యుపయోగింపబడును. దీనిఎత్తు ౨౩౦౦ అడుగులు. ౧౯౩౭-వ సంవత్సరమున పారిసు నగరమున జరుగగలప్రదర్శనముభాగముగ నీగోపురము తలపబడుచున్నది.

ఈగోపురమును నెక్కగోరువారు తమ మోటారులలో ౧౬౦౦ అడుగులఎత్తువరకు పోవచ్చును. బండ్లు ఆఎత్తువరకు పోవుటకు వలయాకారపుఎక్కుడు బాట ఈగోపురముచుట్టును ఉండును. అచటినుండి పైకి పోవుటకు చేదుడుయంత్రములు (elevators)గలవు.

గోపురపుశిఖరభాగమున దీపస్తంభ మొకటియు, వాతావరణస్థితిని కనుగొను యంత్రాలయ మొకటియు నిర్మింపబడగలవు. ఆ ఎత్తున నుంచబడుదీపకాంతి చుట్టు ౧౨౦ మైళ్లవరకు ప్రసరించగలదు. ఆగోపురపుక్రింది భాగమున ౮౩౦ అడుగులవ్యాసముగల పెద్దసభామంటప మొకటి యుండును. అది గొప్ప పౌర సభలు జరుగుట కుపయోగపడును. అత్యున్నతప్రదేశమున ప్రయోగశాలలకు విశేషము అనుకూల్యములు గలుగగలవు. ౧౬౦౦ అడుగుల లోలకము ( Pendulum ) వలన భూమియొక్కచలనము, ఆకర్షణశక్తి మొదలగువిషయముల పరిశీలించవచ్చును. ఈ గోపురపు క్రిందిభాగమున





1. వాతావరణ యంత్రస్థానము
2. దీప స్తంభము
3. శాస్త్రపరిశోధనాలయము
4. హోటలు
5. నాలుగువందలు మోటారు కారులుంచుటకు వసతి
6. దీనియెత్తు 1600 అడుగుల పెండెలమునుంచి, శాస్త్ర పరిశోధనము చేయుటకు వీలుగ నున్నది.
7. సభామంటపము
8. వాయు, తంత్రీ, రేడియో-వార్తా ప్రచారకార్యాలయములు

పత్రికాప్రచారమునకును, ప్రపంచవ్యవహారప్రచారమునకును నుపకరించు యంత్రసాధనము లుండును. నలువదిసంవత్సరములు దీనివలన రాగల సకలవిధములయిన ఆదాయములవలన దీని నిర్మాణమునకు వ్యయమయిన ధనమును రాబట్టవచ్చునట.

"పాప్యులర్ సైన్సు"

---

## పిల్లలగండములు

చిన్నతనమున కుర్రవాండ్రు స్వాయముగగాని, ఇతరులను అనుకరించుతలపుతో గాని తమకగు చెరుపును తెలిసికొనుజ్ఞానము లేక నోటను, ముక్కునను, చెవియందునను ఏదో వస్తువులను ఇరికించుకొనుచుందురు. నోట వేసికొనిన వస్తువులు గొంతులో నిరుకుకొనిపోయి తద్ద్వారా వారికి చాల బాధ గలుగుచుండును. వానిని వెలికితీయించుట చాల కష్టము గు కార్యము. ఒకొక్కప్పుడు, కాదు - తరుచు - వారికి ప్రాణములమీదికి వచ్చుచుండును. తల్లిదండ్రుల దురభ్యాసములచేతను, జాగరూకత లేమిచేతను పిల్లలకీయాపద కలుగుచుండును. పిల్లలకు ప్రాణాపాయము కలిగినయెడల యావజ్జీవము ఘోరదుఃఖముతో క్రుంగవలసినవారు తలిదండ్రులు. వారు ఎంతయో జాగ్రత్తతో తమ పిల్లలను కనుపెట్టియుండవలయును.

సాధారణముగా పెద్దవయసు వారును సుండునూదులు, మడతసూదులు మొదలయినవానిని నోటనుంచుకొని పండ్లతో నొక్కుచు వానిలోని బలుమమాధుర్యమును రుచిచూచుచుందురు. ఇది వారికే ఒకొక్కప్పుడు బాధను కలిగించుచుండును. ఇక ఇట్టివారిని అనుకరించు అజ్ఞానులగు పసికుర్రలమాట చెప్పబనిలేదు.

వెనుకటికాలమున మింగినవస్తువు లోపలనెక్కడ ఉండునో తెలిసికొనుట సాధ్యము కామిచే డాక్టరులు వానిని తీయుటకు చాల కష్టపడెడువారు; తరుచుగా వ్యర్థప్రయత్నులు నయ్యెడువారు. నేడు అట్లుకాదు; యక్సరే (X-ray) ఫోటోద్వారా మింగబడిన వస్తువున్నచోటును, వస్తువునుహూడ స్పష్టముగా కనుగొని దానిని వెలికి తీయుమార్గముల నాలోచించి యుక్తితో నాయుధములసాయమున వానిని బయటికి దీయగలుగుచున్నారు. ఈవిధమయినఫోటోలు ఇట్లు ముఖ్యముగా పసిపిల్లలకు వైతీరున కలిగెడు ప్రాణాపాయమును తొలగించుటకు మిక్కిలి ఉపకరించుచున్నవి. ఇట్టిఫోటోలు రెండు ఈసంచికయందు ప్రకటింపబడినవి.

అందోళకటి: సిలువను మింగిన 'బోష్టను' కుర్రవానిది. వానిపుస్తకలో సిలువ తగులుకొని యున్నది. వానితల్లి మెడనుండితీసి బట్టలబల్లపయి నుంచినసిలువను బాలుడు నోటవయిచుకొని మ్రింగెను. దానిని వైద్యుడు ప్రత్యేకాయుధములతో లోపలనే ముక్కలుచేసి వెలుపలకు తీసివైచి బాలునిప్రాణములను రక్షించెను.

రెండవది: తల్లి నోటిలో మడతసూది నుంచుకొనుచుండుటను చూచుచుండిన ఒకనికాగో కుర్రవాడు ఎనిమిదినెలలవయసుగలవాడు, తాను విడి యున్న ఒకమడతసూదిని నోటవైచుకొని మ్రింగెను. అది గొంతుక దిగకయే నిలిచిపోయెను. గట్టితినుబండములను తినిపించి దానిని తిన్నగా ఎట్టుతెట్టులో కడుపులోనికి పోజేయగలిగిరి వైద్యులు. కాని వెలుపలికి దీయనుపాయమునకయి చాలకష్టపడిరి. కావున తల్లి యొక్క అజాగ్రత్తకు, దురభ్యాసమునకు నిదర్శనములు. విద్యావతులగు స్త్రీలుగల దేశములయందే యీయవివేక కార్యములు జరుగుచున్నవి. విద్యాకరవగు భారతదేశమున నిట్టివి విపరీతముగ జరుగుచుండుట వింతకాదు. తప్పించుకొనుట కుపాయములుగలవని అపాయములను తెలిసి నెత్తికితెచ్చుకొనరాదు. విధికృతముగ సంప్రాప్తములగు వానిని తొలగించుకొనుటకే ఉపాయములు, సాధనములు కల్పింపబడినవి.

పిల్లలకు అనుకోనకుండ వచ్చు గండములలో నిది యొక్కటి. దీని నాతపడకుండ పిల్లలను కాపాడుకొనుటకు తల్లు లెంతో జాగరూకత వహించిన నంత శ్రేయము.

---



మధురానగర దృశ్యము

—యస్. శంకర సుబ్రహ్మణ్యం.

## కేళి

శ్రీరంగం శ్రీనివాసరావు (కవితాసమితి)

*

నిదురవలె, నిదురలో
నొదవు స్వప్నమ్మువలె,
అడుగు సడిలేక న
న్నావరించెదవు.

గాలివలె, గాలిలో
తేలు సౌరభమువలె,
చూచాయ కొలుపకే
సురిగిపోయెదవు.

ఎపుడో నీ ఆగమన,
ఎపుడో నీ నిష్క్రమణ.

*

---

## ఆగడపలు

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

లలితమగు నింగి జవ్వని వళులువాఁగ
జడలి సెలయేటి సోపానసరణినాఁగఁ
నుడువఘూమణి పయ్యెదముడతలనఁగ
రేఁగిన సురాంగనల పాన్పుబాగులనఁగ
మింటిపూఁబోఁడి వీణియమెట్టులనఁగఁ
బఱచు వేల్పురాయంచల మొఱకలనఁగఁ
ప్రకృతిసతి మందహాస తరంగలనఁగ
నాగడప లొప్పుచుండె; రమ్యముగ వింట.

---